Mulkgiri:(Country seizing.) Process, of (Maratha) Land revenue collecting at the point of sword - Baden Powell vol. iii, p. 280.

Taking possession of a country, the periodical incursion of a military force for the collection of tribute or revenue (M. L. J. — Law Lexicon)

ఈ పదాన్ని వీరాస్వామయ్యగారు సందర్భానుసారంగా ఎంత గూఢార్థంతో ప్రయోగించారో చూడండి!

౨౩౦ తోలలుగా చీల పోతున్నది = తోనలవలె విడిపోతుంది; చీలిపోతుంది.

౨౩౧ ఎన్నులు తీయుచున్నవి = ఎన్నులు లేక వెన్నులు వొస్తున్నవి.

౨౪౪ మనిషి కట్టు = మనుష్యస్తోమము.

౨౫౧ రసగుండ్లు = పాదరసగుండ్లు లేక పాదరసము పూసిన గాజు బుడ్లు.

౨౬౬ సూత్రపు పడవలు=మనిష్ఠి తవ్వి యెత్తిపోసే పడవలు; డ్రెడ్జరులనే అలాంటి పడవలకిప్పుడు ఆవిరియంత్రాలను అమర్చారు.

౨౬౭ వొలందావారు = హాలండువారు.

౨౬౯ శిడలు ఆడినట్లు=సిడులాడినట్లు. (సిడి, సిడులు) సిళ్ళు ఆడడమనగా గ్రామదేవతల కొలువులలోను జాతరలలోను మొక్కుకున్న వారి వీపులలోనుంచి ఇనుపగాల ములు దూర్చి సిడిమ్రానుకు అనగా సిడుల జాతరకు నాటిన స్తంభముమీది యడ్డు మ్రానుకుకట్టి త్రిప్పడము. దీనికి గాలపుసిడి అంటారు. ఇది చేయలేనివారిని గంపలో కూర్చొపెట్టి తిప్పే గంపసిడి ఒకటికూడా వున్నది. సిడి అనగా మొద్దులాంటి యూలె అని బ్రౌణ్య నిఘంటువు. నరసిడి గాక మేకపోతుసిడి కూడా వున్నది. దక్షిణదేశంలో ఇప్పటికీ ఇవి జరుగుతూవున్నవి. దీనికి ఇంగ్లీషులో (hook-swinging) అంటారు. 1824 సం॥ ఏప్రిలు 9 వ తేదీన కలకత్తాలో "చరక్ పూజ" అనేజాతరలో సిడులాడడం చూచి బిషప్ హెబరుగారు తమ జర్నల్ లో వర్ణించారు. (చూడు: బిషప్ హెబర్సుజర్నల్ 1 వ సం॥ పుట 98-100) "సిడివేసెలెం దెఅవయోర్తు" పాంకు. 3 ఆశ్వా. - శబ్దరత్నాకరం.

౨౫౪ కయామత్ కా దిన్ = హిందుస్థానీమాట. పుస్తకంలో కయామల్ కా దిన్ అని పొరబాటుగా అచ్చు పడింది దీని అర్థం ౨౫౪ పుటలోనే వున్నది.

౨౬౫ వుండరాములు (చేసినంతిలో)=ఉండగూడదని నిషేధము చేయడం (ప్రాబంధిక భాషలోని 'పోరాములు' అనే ప్రయోగం ఇలాంటిదే)

౨౬౬ తట్టువాణి గుర్రములు = గుట్టపు తట్టువలు; (Tattoo-a Poney - బ్రౌణ్య-మిశ్ర)

౨౭౦ అరమనజాతి = అర్మీనియనులనే క్రైస్తవ జాతివారు

౨౭౫ బొందెగడ్డ = అరటిదుంప; దూట

౨౭౭ బోరుగద్దలు = బోరువగద్దలు; రాబందులు; (Vultures - బ్రౌణ్య)

౨౯౨ ఘూకుమాలీ = ఊడ్చేవాడు

౪౨౪ వుగ్గళించి = (ఉగ్గళించి; ఉగ్గడించి) మ్రోగు; శబ్దించు; వచించు; గట్టి కేకలు [వేయు

,, ఆకరము = ఆధారము

౨౯౬ మాతాశేశెద్ మక్కళ్ క్కె = తల్లి చేసినది పిల్లలు అనుభవిస్తారు అని అరవంలో అవ్వయారు అనే కవయిత్రి పలికిన సూక్తి.

౨౯౭ ఇడిసిన = చెడిపోయిన; ఇడియు అనగా పాడుబడు ఉ: ఇడిసినబావి (బ్రౌన్య)
సీ॥ ఇడిసిన యిండ్లును యెడలఁ బ్రాకే
నుత్తరేను గసింద కోరింద పొదల —ఆము - ౬-౧3

30౪ నిశాని = చిహ్నము.

30౪ తురకరాయి = బెంతరాయి (The Stone Called Laterite) బ్రౌన్య - మిశ్ర.
,, చిత్తురిపని = శిల్పము; చెక్కడపుబని (?)

3౧౧ హస్తాంతరముగా = బదులుగా

3౧౨ బోరిగెలపోసుకోగానే సరేనా? = బోర్లగిల దోసుకోగానే సరేనా?

3౧౫ ఉప్పుకయి వారగా = ఉప్పుకయ్య ప్రక్కగా.

3౧౭ బాందలు = ఓడదొడ్డువులు. వాడలు మరమ్మతు చేయుడానికి తీరమున గదులు గదులుగా తవ్విన దొరువులు (Docks)

3౨౧ వెదురు దబ్బలు = వెదురుబద్దలు; వెదురుపేళ్ళు; సన్నగా చీల్చిన పేడు, బద్ద.
,, సహీ చేసుట = చేవ్రాలు చేయుట, సైను చేయుట.

3౨౭ టీకా చేసేకొరకు = ఒప్పందము, ఖరారు, కంట్రాక్టు, ఏర్పాటుచేయుడానికి.

33౦ నిండార్లుగా = నిండుగా; పూర్తిగా,

3౫౦ జూములా = వెరసి

3౫౧ తాజీం = (తాజీము) సమ్మానము, ఆతిథ్యము, గౌరవము, ప్రత్యుత్థానము;
శా॥ రాజా జారుఁడు మంత్రినిర్దయుఁడు నీ రాష్ట్రంబులోఁ బెద్దలా
కోజాల్ కొండలు జీవహింసకును సంకోచింప రివ్వారికిం దాజీమీయరు.
—అడిదము సూరన్న చాటువు.

3౫౨ తరాతరప్రకారము = (తరాతరముగా) వారి వారి హెచ్చుతగ్గుల ననుసరించి వరుసక్రమంగా; తరాతరము తెలిసి మాట్లాడుట అనగా హెచ్చుతగ్గు తెలసి మాట్లాడుట; (To appreciate, recognize, assign his due merit) ఒకని అధిక్యతను గమనించి గౌరవించుట

3౫3 వర్తకసంచు = వ్యాపారపు మెళుకువ; రీతి; వైఖరి, మోసము; తికమకలు

3౫౪ తూకడానకు = నీళ్ళుతోడుటకు; ఎత్తు, లేవనెత్తు; (అరవము నుండి) (౧౪౦ తూకున తీయబడిన = ఉరిదీయుబడిన) తూకుమాను = ఉరికంబము

3౫౫ అకుత్తు కాదు = వీలుకాదు; కల్లకాదు

3౬౧ కలాపన (పొసగి) = కలత, క్షోభము కలిగి

3౬3 సంకలితరోగాలు = అంటురోగాలు



ఏనుగుల వీరాస్వామయ్యగారి

# కాశీయాత్ర చరిత్ర

# అకారాది విషయసూచిక

(౧) శీర్షికల పక్కనున్న తెలుగు అంకెలు, కాశీయాత్ర చరిత్ర మూలగ్రంథం పుటల సంఖ్యలు. బ్రాకెట్లలో నున్న తెలుగు అంకెలు, శ్రీనివాస పిళ్లగారు వ్రాసిన వీరాస్వామయ్యగారి జీవితము పుటల సంఖ్యలు. ఇంగ్లీషు అంకెలు, ఈ గ్రంథం మొదటనున్న సంపాదకుని పీఠిక, వీరాస్వామయ్యగారు - వారి మిత్రులు, బ్రౌనుగారికి వీరాస్వామయ్యగారు వ్రాసిన లేఖ, మొదలైన విషయాల పుటలు.

(౨) చూడదలచిన విషయం ఎన్ని శీర్షికల కింద కనపడగలదో ఆలోచించి చూచి పరస్పర సంబంధం కల శీర్షికల పుటలన్నీ చూడవలెను.

(౩) ఒక్కొక్క విషయము ఆశీర్షిక ప్రక్క వేసిన అంకె గల పుటతో ప్రారంభమగును. ఆ విషయమింకను తరువాతి పుటలలో కూడా ఉండవచ్చును గనుక పుట తిప్పి చూడవలెను.

అకారాది విషయసూచిక

## అకారాది విషయసూచిక

# సవరణలు

| పుట | కాలం | పంక్తి | శీర్షిక | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 42 | 2 | 34 | ఏకమేవాద్వితీయం బ్రహ్మ | ౨౩ | ౨౩౩ |
| ,, | ,, | 35 | ఏకవారాశనం | ౫౬౩ | ౫౬ |
| 48 | 2 | 26 | దేవరేణ సుతోత్పత్తి | ౧౬౧ | ౧౬౪ |
| 60 | 1 | 19 | నాణ్యములు | ౩౧,౩ | ౩౧,౩౪ |
| 60 | 2 | 7 | నీలిమందు | ౩౩౨ | ౨౪౦ |
| 64 | 2 | 22 | బలులు | ౩౨౧ | ౨౨౧ |
| 70 | 1 | 19 | లకునో నవాబు | ౧ | ౧౬౧ |
| 48 | 2 | 22 | కృష్ణానదికి గోదావరీనదికి మధ్యదేశము. చూడు : హైదరాబాదు నాగపూరుల మధ్యదేశము. | | |
| 49 | 1 | 24 | క్రీస్తు (అవతారము) | — | ౭౩ |